సులభశైలి తెనుగు తేటగీత పద్యాల్లో సంక్షిప్త

# భగవద్గీత

వంగపండు అప్పలస్వామి
ఎం.ఏ. (పాలిటిక్స్) ఎం.ఏ. (తెలుగు) బి.ఇ.డి.
లెక్చరర్, పార్వతీపురం

విశ్వకళాపరిషత్
సరస్వతీ నిలయం
హైదరాబాద్

ప్రథమ ముద్రణ
1974

ప్రచురణ :
విశ్వకళా పరిషత్
హైదరాబాద్



ముద్రణ :
అశ్విని ప్రింటర్స్,
బషీర్ బాగ్
హైదరాబాద్

ప్రతులకు :
సరస్వతీ నిలయం
3-6-321/1 హైదర్‌గూడ
హైదరాబాద్-500001
టెలిఫోన్ : 35123

వెల : రు. 3-00

# ప రి చ య ము

దేవులపల్లి రామానుజరావు
సెక్రెటరీ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
ఆంధ్రసారస్వత పరిషత్ అధ్యక్షులు హైదరాబాదు

శ్రీ వంగపండు అప్పలస్వామిగారు పార్వతీపురం కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్న విద్యాధిక యువకులు. వీరు తెలుగు - రాజనీతి శాస్త్రము రెండింటిలోను ఎం. ఏ. పట్టభద్రులు ఇప్పటివరకు అరడజనుకు పైగా గ్రంధాలను వ్రాసిన రచయిత. పద్యము, వచనము రెండింటిలో సిద్ధహస్తులు.

ప్రస్తుతము తెలుగు పాఠకలోకానికి అందజేస్తున్న "శ్రీ భగవద్గీత" సులభశైలిలో తేటగీతులలో వ్రాసిన చిన్న కవ్యము. గడచిన వేయి సంవత్సరాలకు పైగా భారతదేశములోనేకాక సమస్త ప్రపంచములోని అనేక మేధావుల - ప్రవక్తల జీవితాలను ప్రభావితము చేసిన ఉద్గ్రంథము భగవద్గీత. ప్రపంచ వేదాంత వాఙ్మయమున భగవద్గీతతో సమానమైన గ్రంథము మరొక్కటి లేదు.

శంకరాదులైన భాష్యకారులపైననేకాక, తిలక్-గాంధీ మొదలైన ఆధునిక నాయకులమీదనేగాక, ప్రాచ్య పాశ్చాత్యదేశాలలోని మహనీయులైన యెందరిమీదనో భగవద్గీతప్రభావము స్పష్టముగా గోచరిస్తున్నది.

ఇటువంటి ఉద్గ్రంథమును తెలుగు తేటగీతులలో అందరికీ అందుబాటులో నుండువట్లుగా తీసుకొని వచ్చిన శ్రీ వంగపండు అప్పలస్వామిగారు అభినందనీయులు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మధ్యతరహా నీటి పారుదల మంత్రులు, నాకు మిత్రులైన శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడుగారికి యీ గ్రంథము అంకితము చేయడం నాకు మిక్కిలి సంతోషకరమైన సంగతి. శ్రీ కృష్ణమూర్తి నాయుడుగారు రసజ్ఞులు, సజ్జనులు, ప్రజ్ఞానిధులు. ఇకముందు శ్రీ అప్పలస్వామిగారు అనేక గ్రంధాలనురచించి తెలుగుభాషను సంపన్నము చేయగలరని ఆశిస్తున్నాను.

రామానుజరావు

# శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు



కృ తి క ర్త

ప్రజలమనిషి, ప్రజానేత, ప్రగతిశీలి
ప్రజ్ఞగలవాడు, ప్రముఖుడు, ప్రజలహితుడు
మంత్రివర్యుడు, మిగుల సౌజన్యపరుడు
ఈతడే వాసిరెడ్డి శ్రీ కృష్ణమూర్తి

ర చ యి త

# కృతి సమర్పణ

## శ్రీ భగవద్గీత

ఆంధ్రప్రదేశ్ శాసన మండలి నాయకులు
మధ్యతరహా నీటిపారుదల శాఖామాత్యులు

## శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడుగారు

శ్రీ రామచరితంబు స్థిరముగా రూపొంది
భువియందు నొప్పారె కవితవలనె
శ్రీ కృష్ణలీలలు చిద్విలాసమునంది
రమణీయ తనుపొందె కవితవలనె
శ్రీ మహాభారతంబీ పృద్విజనియించి
కాంతిరేఖల జిమ్మె కవితవలనె
శ్రీకృష్ణరాయల కీర్తిచంద్రికలెంతొ
యవనిలో విలసిల్లె కవితవలనె

సృష్టిగల నీతిరీతులు స్పష్టమౌట
కవులు సృష్టించు రచనల కతనగాదె
వాసికెక్కిన వెలమల వాసిరెడ్డి
కృష్ణమూర్తికి నర్పింతు కృతిని మిగుల.

అంకితంబంద నందరు నర్హులొక్క
వాసికెక్కిన సుగుణాళి నన్నెకెక్క
మేల్మిశీలంబు నీలోన మెరయుకతన
నొసగితిని నీకె నా కావ్య కుసుమమిదిగొ

రచయిత

# శ్రీ కోకా రాఘవరావుగారు



విశ్వకళా పరిషత్ అధ్యక్షులు

న్యాయవాది, పేర్వడసిన రచయితితడు -
కార్య నిర్వాహకుండు, గాయకుడు, నటుడు
జాతిసంస్కృతి సాహిత్య కాంతులీన
నుర్వి కృషిసల్పు సాహిత్య పోషకుండు

రచయిత

# కృతజ్ఞత

**శ్రీ కోకా రాఘవరావు**

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయవాది

విశ్వకళాపరిషత్ అధ్యక్షులు

తెలుగులో నే రాసిన శ్రీ భగవద్గీతను వెలుగులోనికి తెచ్చి నా జీవితానికొక సార్థక్యతను కలుగజేసిన శ్రీ కోకా రాఘవరావుగారిని నా హృదయంలో కలకాలం నిలుపుకొంటాను.

నా ఆప్తమిత్రులు సంస్కార సభ్యతల్ని అలవరచుకొన్న సత్పురుషులు. నన్ను అనేక సమయాల్లో ఆదుకొని ఆప్యాయతల నందించిన అనురాగమూర్తి శ్రీ రాఘవరావుగారు.

నిరుపమాన విజ్ఞానం - నిర్మలమైన మనస్సు - నిత్యంవికసిత వదనంతో, నింపుగా కన్పిస్తారు శ్రీ రాఘవరావుగారు. ప్రేమాను రాగాల్ని చిందించి, వాటిని ప్రతి ఒకరిపట్ల స్పందించి, అనురాగ ఆప్యాయతల్ని అందరినుండి అందుకోగల సంస్కారి, సౌజన్యుడు, శ్రీ రాఘవరావుగారు.

తనదైనందిన న్యాయవాదివృత్తి నిర్వహణలో ప్రఖ్యాతిపడసి, మంచిపేరు ప్రఖ్యాతుల్ని ఆర్జించుకొంటూ నిరంతరం, తన నిరుపమాన ప్రతిభాసామర్థ్యాల్ని ప్రదర్శిస్తూ నేడు పలువురి మన్ననల నందుకో గలుగుతున్న వ్యక్తి శ్రీ కోకా రాఘవరావుగారు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రముఖ న్యాయవాది ఆంధ్రప్రదేశ్ లా జర్నల్ లా ఎక్స్‌ప్రెస్ సంపాదకులు. అనేక న్యాయశాస్త్ర గ్రంథాల రచయిత 'బార్

అసోషియేషన్ ఆఫ్ ఇండియా' ఆంధ్రప్రదేశ్ స్టేట్ బార్ కౌన్సిల్ కార్య నిర్వాహక సభ్యులు ఆంధ్రప్రదేశ్ లాయర్స్ కాన్ఫరెన్స్ ప్రథమ కార్యదర్శి.

ఆంధ్రుల రాజధాని నగరాన రాష్ట్ర హైకోర్టు ప్రముఖ న్యాయవాదిగానిలచి, న్యాయశాస్త్ర రంగాన ఒకనిపుణునిగారాణిస్తూ, ప్రతిభావంతుడని ప్రతి ఒకరిచేత పొగడ్తల నందుకొంటున్న శ్రీ రాఘవరావుగారు, సంగీతం, సాహిత్యం, నాటకరంగంవంటి తదితర రంగాలలోకూడా తగిన ప్రజ్ఞా సామర్థ్యాల్ని ప్రదర్శించడం, తన బహుముఖ ప్రజ్ఞను ప్రస్ఫుటపరచుటకు నిదర్శనంగా నిలువగలదు.

జంటనగరాలలో అనేక సాహిత్య సాంస్కృతిక సంస్థల స్థాపనకు, అభివృద్ధికి నిర్విరామకృషి సల్పుతున్న సంగీత సాహిత్యాభిమానులు శ్రీరాఘవరావుగారు "వృత్తిరీత్యా సాగనిపని అయినప్పటికీ, మనోప్రవృత్తి అటు మొగ్గుతూ వుండడంవల్ల, వీలైనప్పుడల్లా సాహిత్యంలోకూడా కొంత కృషిచేయ గలిగాను" అని శ్రీ రాఘవరావుగారే తన "శిల్పి"లో పొందుపరచారు.

భాగ్యనగరంలోగల విశ్వకళా పరిషత్‌నకు అధ్యక్షులు - విశ్వసాహితికి ఉపాధ్యక్షులు. హైదరాబాద్ థియెసాఫికల్ సొసైటీ ఉపాధ్యక్షులు - అందువలననే నా యీ రచనకు ప్రచురించే సదవకాశాన్ని వారు నాకు కలిగించారు - తనొక రచయితగా నుండడమే గాక సాహిత్యాభిమానం గన్పరచి సాహితీపోషకులుగా నేడు నాయీ గ్రంధ ప్రచురణతో నిలచారు - అఖిలభారత తెలుగు రచయితల మహాసభకు కార్యదర్శిగానుంటూ ఆంధ్ర సాహిత్యానికి ఎనలేని సేవ చేస్తున్న సాహితీప్రియులు శ్రీ రాఘవరావుగారు.

హైదరాబాద్‌లోగల వాణీ గానసభ - కళాభారతి - స్వరతరంగిణి. నటి సమాఖ్యలకు నేడు వీరు అధ్యక్షులుగా నుంటున్నారు.

సాహిత్యపరంగాకూడా సమాజానికి సేవచేయాలన్న సత్సంకల్ప ముతో, ఆంధ్ర సాహితీరంగాన ఒక అపురూప కళాఖండంగా నిలిచి పోగల "శిల్పి" అను గేయసంపుటిని వీరు రచించగా, విశ్వసాహితీ సికింద్రాబాద్‌వారు దానిని ప్రచురించారు - "శిల్పి" రచనలో తను పొందుపరచిన రచనా శిల్పాన్ని ఉగ్గడిస్తూ "శిల్పి"లో ప్రముఖ విద్వత్కవులు, పండితులు, సాహితీ విమర్శకులు పొందుపరచిన - కావ్య పరిశీలన - కతనుతొర్పికొన్నాలి - ఆముఖమ్ - పరిచయా - లను మనం పరిశీలిస్తే తన ధీ ప్రజ్ఞా విశేషాలతో పాటు, తన రచనా స్వరూపం మనకవగతం కాగలదు.

నాపట్ల నా రచనలపట్ల ఎంతో ఆప్యాయతను ప్రదర్శించి నా యీ రచనను వెలుగులోనికి రావటానికి వెలలేని సహాయ సహకా రాల నందించి, కలకాలం నా హృదయంలో ఒక సాహితీవేత్తగనే గాక, ఒక సాహిత్యపోషకునిగా నిలచిపోగల శ్రీ రాఘవరావుగారిని గూర్చి నేనేమి వ్రాసినా అది అతిగా ఇతరులకు కన్పించద మొక సహజమైన విషయం.

అందుకు తను వ్రాసిన "శిల్పి"లో పొందుపరచబడిన విద్వ త్కవుల అభిప్రాయాల్ని తనపట్ల నాకుగల కృతజ్ఞతకొక చిహ్నంగా మరల నా యీ గ్రంథంలో నుదహరిస్తూ పొందుపరుస్తున్నాను.

విశ్వసాహితీ సికింద్రాబాద్ వారి అధ్వర్యమున వారి "శిల్పి" గేయసంపుటి ఆవిష్కరణ ఉత్సవం ఆంధ్ర సారస్వత పరిషత్ భవనం హైదరాబాద్‌లో 1974 అక్టోబరు నెలలో జరిగింది. ఆ దినం జరిగిన కార్యక్రమానికి పలువురు ప్రముఖులు విచ్చేసారు. విశ్వసాహితీ కార్యదర్శి కొత్తపల్లి సుబ్రహ్మణ్యం స్వాగతంపలుకగా, ధీ ప్రజ్ఞాశాలి ఆంధ్రప్రదేశ్ పాశ్చాత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించారు. ఆంధ్ర

డాక్టర్ వేంకటావధానిగారు "శిల్పి" కావ్యాన్ని సమీక్షిస్తూ "ఇందలి ఖండకావ్యములన్ని వచన కవితలని అవి శుష్కవచన ములు కావని అంతరలయతో, అద్భుతభావములతో అనంత సత్య కథనముతో, అలరారు అందమైన కవితలని అస్పష్టత, అహం భావములేని రచనలని శ్రీ రాఘవరావుగారి "శిల్పి"లోగల కవితా శిల్పాన్ని కడు రమ్యముగా నభివర్ణించినారు అంతియేగాక, శ్రీకోకా రాఘవరావుగారు వృత్తిచే న్యాయవాదులయ్యు ప్రవృత్తిచే సాహితీ ప్రియంభావుకులని, శ్రీ రా వు గా రా కృ తి నే, అభిదానమునవేగాక అంతరభావములందు రాఘవులేయని ఐహుచక్కగా నాతని వ్యక్తి త్వాన్ని ప్రస్ఫుటపరచి పాఠకుల కందించారు.

ఆంధ్రుల అభిమాన ఆధునిక సినీరచయిత, అందచందాల అపు రూప గేయ కవితలవల్లుటలో నఖండ ప్రజ్ఞానిధి, ఆంధ్రభాషా సరస్వతికి అపురూప మధుర కవితా కానుకల నందించుటలో నందె వేసిన చేయి డా॥ సి. నారాయణరెడ్డిగారు కోకారాఘవరావుగారి రచనకు తొలిపలుకు వ్రాస్తూ "ప్రకృతిపురుషుల అనుబంధం రకరకాలుగా కల్పితం వర్ణితం, కొందరు సుతారపు గీతలలో చిత్రిస్తే, కొందరు సుత్తెదెబ్బలతో, ఏమైనా దారి ఏదైనా, కవి అనే మనిషికి వర్ణనం అనివార్యం అని రాస్తూ "శ్రీ రావుగారు వేస్తున్న తొలి అడుగు ఇది మునుముందు కదనుతొక్కాలి" అని సి. నారాయణరెడ్డిగారు అభిభా షించారు. అంతియేగాక, "చిరునవ్వులాంటి మనిషి మరుమల్లెలాంటి మనస్సు, కోకా రాఘవరావుగారని అంటూ నాతని వ్యక్తిత్వాన్నికడు రమ్యంగా చిత్రించారు సి. నా రె. "ప్రకృతిని రసమయ ప్రకృతిగా అపుడపుడు విషమించిన వికృతిగా" లోకాన్ని రాఘవరావుగారు రెండు దృష్టులతో గాంచగలిగినవారని స్పష్టపరిచారు సి. నా రె.

ఆంధ్ర సాహితీవేత్త డా॥ అరిపిరాల విశ్వం వారి "శిల్పి" గేయ సంపుటిని సమీక్షిస్తూ "దూరపు ఆకాశంలో పొడసూపిన అరుణరేఖ

లేవి - సూర్యోదయంకోసం వేచియుండాల్సిన కొత్త ఆశలివి. అంటూ వ్యాఖ్యానించారు. నవతకన్న మానవత మిన్నయని, కవితను బతికించేది అనుభూతని, తెలుపుతూ, వినాదాలు ఆర్తనాదాలు పారవశ్య ప్రలాపాలు కవితగా చెలామణీ అవుతున్న యీనాడు - ఓ క్షణమైన విన్ను పెంచే కవిత - వీకు మనస్పునించే కవిత ఎప్పుడోతప్ప రావడం లేదని, కవిత వ్యక్తిని ముగ్ధుణ్ణిచేయాలని స్పష్టపరుస్తూ, ఈ కవి ప్రయత్నం పండి తెలుగు కవితాకాశంలో మరో కొత్తవెలుగు నిండాలని ఆశిస్తున్నా మన్నారు విశ్వంగారు.

అఖిలభారత తెలుగు రచయితల మహాసభ. అధ్యక్షులు, తెలుగు సాహితీరంగాన ఒకకొత్త వెలుగుగా నేడు ప్రకాశిస్తున్న ప్రముఖ పత్రికా సంపాదకులు శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు శ్రీ రాఘవ రావుగారి "శిల్పి"ని సమీక్షిస్తూ "వారి కలంనుండి వెలువడిన ఒకఅపురూప కళాఖండమని వర్ణించారు. బహుముఖప్రజ్ఞ - పరిణితిచెందిన అమృతహృదయం. మమతలుచిందిన మనిషి, ఇదే నిండిన మూర్తి శ్రీ రావుగారని అంటూ వారి వ్యక్తిత్వాన్ని ఎంతో చక్కగ వ్యక్తీకరించారు. అంతియేగాక, న్యాయవాది, రంగస్థల రేడియోనటుడు, నిర్వాహకుడు, గాయకుడు రచయిత, ఏ రంగంలో ప్రవేశించినా ఆ రంగానికి శోభ కలిగించేవి మాత్న వ్యక్తి శ్రీ రాఘవరావుగారని శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు ఆంధ్ర పాఠకలోకానికి పరిచయం చేసారు. ఆంధ్రుల భాగ్యనగరాన, తనొక హైకోర్టు ప్రముఖ న్యాయవాదిగ వెలుగుతునే, శ్రీపోతుకూచివా రన్నట్లు "సాహిత్యానికి వన్నె"-తద్వారా పాఠకులకు మదుర మంజుల బావాల వెన్న- తన కవితలద్వారా నేడు అందించగలుగుతున్నారు.

ఇంతటి బహుముఖ ప్రజ్ఞానిధి నేడు మరొక ప్రత్యేకమైన కీర్తి ప్రతిష్ఠల్ని ఆంధ్రసారస్వత లోకాన అందుకోబోతున్నారు. అదే శ్రీ

రాఘవరావుగారు రచయిత, సాహితీప్రియుడేగాక, సాహిత్యపోషకుడు విశ్వభారతి కళాపరిషత్ అధ్యక్షులుగా నా రచనను ప్రచురిస్తూ, ఆంధ్ర పాఠకలోకానికి నన్ను పరిచయంచేస్తున్న శ్రీ రాఘవరావుగారికి మరొక మారు నా కృతజ్ఞతాపూర్వక అభినందనల్ని సమర్పించుకొంటున్నాను. ఆంధ్రసాహిత్య వికాసానికి అవిరళ కృషిచేస్తున్న శ్రీ రాఘవరావుగారిని మనసారా అభినందిస్తున్నాను.

ఆంధ్ర సాహితీలోకానికి ఎనలేని సేవజేస్తున్న అమిత ధీ. ప్రజ్ఞాశాలి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు నే వ్రాసిన గ్రంధాన్ని పరిశీలించి, అందు పైవారి అమూల్యాభిప్రాయాన్నిస్తూ, ఆంధ్రపాఠకలోకానికి నన్ను పరిచయం చేసినందుకు వారికి నా వినయపూర్వక కృతజ్ఞతలు.

నా కృతిని స్వీకరించి, నాపట్ల అమిత ప్రేమానురాగాల్ని ప్రదర్శించిన, శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడుగారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

నాకు విద్యాబుద్ధుల్ని గరిపి, నన్నింతటి వానిని జేసిన నా చిన్న నాటి గురువులు స్వామి విరజానందకు (శిరోమణిగారు) నా హృదయ పూర్వ కప్రణామములు.

రచయిత

అప్పలస్వామి

# తొలిపలుకు

శ్రీయుతులు — శ్రీ వంగపండు అప్పలస్వామి లెక్చరర్ గారిచేత రచింపబడిన "భగవద్గీతను పరిశీలించితిని. సంస్కృత భాషా పరిచయంలేని వారికేగాక, మాతృభాషయైన తెలుగులో కూడా తగినంత పాటవములేని సామాన్యులకుకూడ అర్థము కావలెనను మహదాశయంతో సంస్కృత భాషయందున్న భగవద్గీతను, తేటతెల్లమగు తెలుగుభాష యందు సులభశైలి తేటగీత పద్యాల్లో ననువదించుట, తెనుగుతల్లికి ఒక నూతనాలంకరమును గూర్చుటయనియే యని నేను భావిస్తున్నాను.

కవితా ప్రపంచమున నీకవి కడు నూతనుడేయైనను కమనీయ భావములు గడలుకొనునట్లు కమ్రపదప్రయోగముల నొనరించి కడు రమ్యముగ కవితయల్లుట కతిపయ ప్రాచీనకవుల కంపించుచున్నాడు.

ఇది జన్మాంతర సంస్కార మనుటకేమి సందేహము ! ఈతనికి మంచి భవిష్యత్ గలదనియు అనతికాలముననే అతిరమ్యమగు రచనల కొనసాగించగలడనుటలో సంశయ మేమియు లేదు.

ఉత్తమశ్రేణి కవులలో నీతడొకవిగా పరిగణింపబడుటకు, భగవంతుడీతనికి యితోధిక శక్తిని, యుక్తిని, ఆసక్తిని ప్రసాదించుగాక.

మకాం :
రాజమండ్రి

స్వామి విరజానంద
సాహిత్య శిరోమణి

# మనవి

మత సహనమున్న మనిషి మహాత్ముడెగద
సకలజాతి సమైక్యత సాగనప్పుడె
ప్రార్థనముగాన, మనసు నిర్వైర్యమంది
మానవత పూలు వికసించి మహిని వెలయు

కమ్మని పదాలు యిమ్ముగ గుమ్మరిలగ
సొంపొసంగిన భావాల సూక్తి మెరయ
రసము విరజిమ్ము రమ్యంపు రచన యౌను
కవిత, నిజమిది దేవుని కరుణగాదె.

తెనుగు నుడికారమెంతయు తేటపడగ
సహజ కవితారసస్ఫూర్తి చౌకళింప
భావనాశ్వమ్ము జివమున పరుగులెత్త
రచనజేసితి సత్కృతుల్ రమ్యమనగ.

రచయిత

శ్రీ హయగ్రీవాయ నమః

# శ్రీ భగవద్గీత

భగవంతుని దూత

అది జగదైక మాత

సంసార ఈతకు వూత

శ్రీ భగవాన్ సత్య సాయిబాబా

# శ్రీ కృష్ణ పరమాత్మ

కలియుగంబిది మీకెల్ల తొలి యుగమున 1
తెలుపబడినట్టి దేవుని దివ్యవాక్కు
తెలియపరతును మీకంత తెలియవినుడు
ఇహపరాలకు తోడ్పడి యిడునుముక్తి

ప్రతి యుగమునందు జగతియు ప్రగతిగాంచ 2
ధరణి కరుదెంచునా జగద్రక్షకుండు
ధర్మము నశించి నీతియు తరుగుచుండ
మర్మమెరిగించ పుట్టును కర్మసాక్షి

ధర్మమార్గమునకును అధర్మమునకు 3
జరుగు సంఘర్షణంబును జాటి మిగుల
వ్యాసకృత భారతంబిల వాసికెక్కె
ధర్మమే సుస్థిరంబను మర్మమరసి

జీవులిలను సుఖాలకు దేవులాడి 4
తోవగానక ఐడుదురు గావుకేక
లిలను యాత్రుల రక్షింప నీశ్వరుండె
మనుజ రూపాన వెలగంగ మహికివచ్చు.

అవని భారము దీర్పగ దివిని విడచి 5
భువిని వెలసెను శ్రీ కృష్ణ భూవరుండు
సృష్టిగల దుష్టశక్తులు నష్టపడగ
స్పష్టమగు రీతి యాధరపట్టుపడగ.

ఆశ వ్యామోహ రీతులె అలముకొనగ 6
ఆత్మ విజ్ఞాన మీఫర నరయగలమ ?
అవని జనులకు బోధింప నవతరించె
నరుని రూపాన లేకున్న నరుడు వినున ।

చేతలకె నూత విడగల గీతనిలను 7
సంశయాత్ములు సరిలేక సణుగుదురిల
సమర భూమిలొ జూడ సంవాదమేమి
కదనరంగాన యాత్మ ప్రభోదమేమి.

ఇమిడియున్నది గూఢార్థమిందులోన 8
నరుని కిలతోడు పరమాత్మ యరయగాను
మనసు పరిపక్వమందిన మధుర క్షణమె
తత్త్వమరసెడి బుద్ధిని తనకు నిడుమ

మానసికమైన ఘర్షణ మదిని రేగ 9
మనిషి తత్త్వమునందుకు మహిని జూడ
మదినిగల రాగద్వేషాలు మరలిపోవ
నాత్మపరమైన విజ్ఞాన మలవడునిల

విమల వైరాగ్య భావన వెల్లివిరియ 10
ఆశ వ్యామోహరీతులు యంతమొంద
వ్యక్త్యహంకృతి తనలొాయ వ్యక్తమవగ
నరసినాడంత ఫల్గుణుడాత్మ సుకృతి.

రచయిత

# శ్రీ భగవద్గీత

## అర్జున విషాదయోగము

### 1వ ప్రకరణము

ధర్మ భూమి కురు క్షేత్ర మర్మమరసి
పాండు కురుపుత్ర లెట్లు నుత్సాహులగుచు
కదన మొనరించ నేరీతి కదిలినారొ
తెలియ జెప్పుమ సంజయ తేటపడగ. 1

మిగుల ధృతరాష్ట్రు డీరీతి పిలిచి యడుగ
సంజయుండంత పరికించె సమరభూమి
యుద్ధ మొనరించ నెంతైన సిద్ధపడెడి
పాండవుల కౌరవులగని పలికెనిట్లు 2

ఉభయపక్షాలు రణభూమి నురికె మిగుల
వీరవరులెల్ల కురుభూమి జేరినారు
పాండవులవైపు ద్రుపదాది రథికులుండ
కౌరవుల వెనుక భీష్మాది ప్రభుతులుండె 3

పెనుగులాడుట కొకచోట పేరుకొనిన
కౌరవుల పాండవుల సైన్య మహామహామని
ఒకటి నొకటిని ఢీకొన నుత్సహించు
ఎలిమి గజముల చందాన యిలను నిలచె 4

కౌరవుల సింహనాదాల గర్జనలకు
పాండవుల శంఖనాదాలు బదులుపలికె
*క్రౌర్యము తొలంగి క్రాంతికి కదనమింక
జరుగనున్నది ధరణికి శాంతికలుగ 5

తెల్లనౌ యశ్వముల పూన్చు తేరుపైన
నరుడు నారాయణుండును యరగినారు
అచ్యుతుడు పాంచజన్యము మెచ్చనూదె
దేవదత్తము పూరించె దైవ సఖుడు 6

ఘోర సంగ్రామ మొనరించ బూనినారు
ధరనుగల యోధవరులంత దర్పితులయి
*ధర్మమిలన ధర్మంబులైన జరిపెబలాత్ము
దాడి శ్రీకృష్ణ పరమాత్మ క్రాంతిమది 7

పార్థసారధి వినగన పార్థుడంత
గాండీవము బూని యిట్లనె ఘనతమెరయ
నడుపుమో కృష్ణ రథమును వడివడిగను
పొగరణంతును కౌరవుల్దిగులుపడగ 8

పోరు సల్పెద పోనిమ్ము ధారుణిగల
దురిత మతులను దునిమెద దురమునయన
విజయసారధి రథమును వేగపఱచె
రెండు పటాలనడుమను యుద్ధరీతి 9

---

* గీతలో తెలుపబడినది కాదు.

మధ్యభాగాన పాండవ మధ్యముండు
రథికుడై నిల్చి సర్వంబు మదినెఱుంగ
పరవ రూధినినొగ్గి పరికించినాడు
ఒరులు గారని వారల నెరిగినాడు 10

ఏమి ? శ్రీకృష్ణ వీరంద రెవరటయ్యా
ఆత్మబంధు సమూహమే, యరయ మీవు
బంధుమిత్రుల బరిమార్చి బ్రతుకగలనె
ఎందుకొచ్చిన తగవు ముకుందమనకు 11

*అవనిగల విషాద మన వైరాగ్యమనగ
అర్జున విషాదయోగము యనవిదోచె,
ధరను విద్యుక్త ధర్మాలు మరుగవడిన
అలముకొనునది ధరను విషాదమనగ 12

ఆత్మబంధులజూచిన యాత్మలోన
మిగుల దిగులయ్యె భీతియై మ్రగ్గిలెనయ్యా
మనసు చాంచల్యమందె నాననముకందె
గాండీవము పట్టుతప్పెను గుండెలెండె 13

ఎంత దుర్బుద్ధులైనను చేంతనున్న
స్వజనమును చంపదలచుట సవ్యమగునె
బంధుమిత్రుల దునుముట పాడియయ్యె
ఉర్వి నీరీతి జేయుట యున్నతంబె 14

* గీతలో తెలుపబడినది కాదు.

రాజ్యమేవద్దు నాకీల రణమువద్దు
భోగభాగ్యాలకై దురుద్యోగమొద్దు
తుచ్ఛమగు మేని సుఖములతులను తూగ
స్వచ్ఛమగు రీతి కాయుట మెచ్చనగునె

ధర్మమీమాంస ! మదినెంచి తార్కికుడయి
మిక్కిలిగ గుందినరుడిట్లు చక్కనుడిదె
రక్తసిక్తము రాజ్యము రాజ్యరమయు
రుధిరమగు కూడు తినుయాశ మదిని లేదు

గురులు, తాతలు, తండ్రులు వరసుతులును
కులముక్షీణించ వీరిని కూల్చగలన !
అబ్బ త్రైలోక్య యాధిక్యతన్నకూడ
బంధుమిత్రులజంపెడి భ్రాంతిలేదు 1

పలువురను జంపు పాపపు బ్రతకదేల
పొందగలిగినదేమి గోవిందమనము
బంధువుల నెల్లమ్రందించు పని విహితమె
శత్రుభావంబుయిల నపవిత్రముగద 1

క్షేత్రధర్మము కడున పవిత్రమగునె
కులము క్షీణింపజూచుట కూడనిపని
దోషమెరుగక శత్రులు ద్వేషముగొన
దోషమెరిగిన మనకు నీ ద్రోహమేల 1

కులము క్షీణించ ధర్మాలు కూలిపోవె
ఆది గావచ్చుయను శృతియాగిపోదె
ధర్మమిలబాసి సర్వమధర్మ మగుచు
పాపరీతులె మనకింక పట్టువడును 20

సాంప్రదాయాలు నీధర సన్నగిల్ల
వంశ మర్యాదలను నవివట్టి వగును
కులము ధర్మాలు నిలలోన వెలితిపడిన
నీతినియమాలు నరిగను నిలుచుటెట్లు 21

కులము నిలకొల్లగొట్టుటకు రచగాదె
వంశ నాశనమది యెంతొ వక్రరీతి
బంధు నిర్మూలనము పాపబంధ మరయ
దోషమంటగ తప్పదు దొసగుకూడ 22

వంశమాచార తెరగులెవ సుధబాయ
కులమునందలి స్త్రీలెల్ల ఖిలమునంది
అక్రమంబగు తీరుల నరుగగలరు
కట్టుభాటులనెల్లను కాలదన్ని 23

గౌరవముబాసి స్త్రీలింక గడినిదప్ప
వర్ణసంకర మేర్పడు వసుధలోన
వంశ ప్రఖ్యాతియన్నది వట్టిపోవ
నరకలోకమె మిగులననాది పురుష 24

వర్ణ సంకరమేర్పడ వాసుదేవ
కులము మర్యాదలనునవి తెలియబడవు
జాతి ధర్మము జనగను జగతిలోన
నీతిదప్పిన రీతులె నిలువగలవు. 2

వర్ణసంకరమనునది వసుధలోన
నరకమొందించగలిగెడి కరకురీతి
వంశహానిని తలపెట్టువాడు యిలను
పితరులకు పిండమిడకనె బ్రతుకగలడు. 2

రాజ్యలోభమె నాలోన రగుల్కొనిన
పూజ్యమగు పుణ్యమీ ధరపుణ్య పురుష
పాపమేగాక నిదియొక తాపముగద
నష్టమై దేశమునకెల్ల రిష్టమగును. 2

శాంతినందిన మనకు ప్రశాంతి కలుగు
ఒరులకిల నేను యోడిన శోకమెహాకు
ఇలను నాబంధుకోటియు నిలువగలదు
యుద్ధమేగాంచు దుర్దశ యుండబోదు 28

దైన్యతనుజెంది పార్థుండు ధనువువిడచి
అమిత శోకాబ్ధినందున యడుగు పెట్టి
కదనరంగాన రథముపై జదికిలబడె
మనసునందున భయభీతి మంటలెగయ 29

# సాంఖ్య యోగము

## 2వ ప్రకరణము

బంధు మమకార ప్రీతి చేకుందుచున్న
ఫల్గుణుడు వినపరమాత్మ జలికెనిట్లు
వ్యక్తి విద్యుక్త ధర్మంబు వ్యక్తపరచి
అర్జున విషాదమెల్లను యంతమొంద 1

వినుము ఫల్గుణసుంత నెమ్మనముంచి
కీర్తికినిబోయి యపకీర్తి దాల్తువయ్యా
మోహమందియు భ్రాంతిలో మునిగినావు
స్వీయధర్మాను చరణము చెరుఃటయ్యా. 2

హృదయ దౌర్బల్యమందుచు మదనపడకు
ఱితిని జూడగనది యెంతో క్షుద్రముగద
దాని విడనాడి సద్ధర్మమూని యిపుడు
యుద్ధమొనరింప నీవింక సిద్ధపడుము. 3

తెమ్మగాండీవ మదిగొనిర మ్మపార్థ
పిరికి తనమును విడనాడి నరుకవయ్యా
శత్రువులనెల్ల నీవు సక్షత్రియుడవు
వెనుకడుగదేల మనకిల వెలితిగాదె, 4

మాధవుండిట్లు లెమ్మని బోధపరచ
బాధనందివ పార్థుండు బలికె నిటుల
దూషితులుగారు ద్రోణాది భీష్ములిలను
పూజనీయుల నే నెట్లు పూడ్చగలను ? 5

గురువులను జంపె నెత్తురుకూటి కొరకు
వథము డితడని లోకము మదన పడదె
అన్యులపహరించి సన్మాన్య లగుటకన్న
బిచ్చమెత్తుక బ్రతుకుట మెచ్చదగును ! 6

త్రిభువనాలను పాలించు ప్రభుడనైన
ఇంద్రపదవిని చేపట్టి అందుకొనిన
మనసునందున్న దుఃఖము మరలగలద
ఇలను, సంఘర్షణ మశాంతి, నిచ్చునుగద 7

యుద్ధ మొనరింప నుంటిమి సిద్ధమగుచు
ఎవరి నెవరిల జంపుదు రెవరెరుంగు
ధర్మసమ్మూఢమను మనంబు మర్మమెరుగ
శిష్యుడనుగాదె నన్ను శాసించవయ్య 8

అర్జున విషాదరేఖల నరసి మిగుల
చిరు, నగవుమోము, నందున చిందులాడ
నరుని దీనత పోగొట్టు వరములీయ
వనజభవు తండ్రి పార్థుండు వినగ బలికె 9

గొప్ప వేదాంతివలెనీవు గోచరించి
మెప్పునందిన విషయాల జెప్పినావు
నీదు పలుకులు విజ్ఞాన మోదకములు
కనగచేష్టల యజ్ఞాన కారకములు 10

ఆత్మజ్ఞానము నందెడి యర్హతగల
ఆత్మ పరిపక్వభావము నందినావు
అవనిలో నీదు యజ్ఞాన మంతమొంద
సాంఖ్యయోగ విధానము సఖుడ వినుమ. 11

పలుకులందున వైరాగ్య మొలకవోసి
పామరునిరీతి భ్రాంతిలో పడెదవేల
చావు పుట్టుక లీ ధర సహజముగద
నిక్కమరసియు పండితు లిక్క మెలగు. 12

జీవి పుట్టుచు, పరిణామ భావమంది,
సృష్టినిండార మిగులను స్పష్టమగుచు,
మరల నాశనమందుచు, మాటువడుచు,
తిరిగి యుద్భవమందును, ధరణిలోన. 13

జ్ఞానులగువారు పైరీతిగాంచి మిగుల
మోహమదిలేక వారెల్ల ముక్తులయిరి
చావుపుట్టుకలనునవి సఖియలు కద!
ధ్వంధ్వములె జూడ నిలలోన బంధనములు. 14

హెచ్చుతగ్గులు ప్రకృతియం దెప్పుడుండు
కష్టసుఖములు నిలలోన స్పష్టముగద
వీగు గెలుపులు నిలతుల తూగియుండు
ధ్వంధ్వ జగతిది తెలియుమో ధవ్యచరిత. 15

శోకమోహాలె బీజాలు లోకమందు
ప్రాణులను దుఃఖపెట్టెడి! ప్రాణసఖులు
వ్యక్తియందున నీ రెండు వ్యక్తమైన
ముక్తియెక్కడ మరి శాంతి వ్యక్తికేడ. 16

జూడ జగమందు సంసార జాడయిదియె
మోహశోకాల కయ్యది మూలమరయ
ఆత్మవిజ్ఞాన మిలవ్యక్తి కలవడకను
ఘోర సంసార మదిదాట నేరితరము. 17

చావు పుట్టుకలేనట్టి ప్వాత్మకొరకు
నీవు దుఃఖించ పనిలేదు నిజము వినుము
నేను నీవును మరియు యా నృపులుకూడ
ఉంటి మొకనాడు యిక మీద నుండగలము. 18

బాల్య యౌవన వార్ధక్య దశలనేవి
జీవి పరిణామ రీతికి త్రోవలు గద
అటులె జీవుడు నన్య దేహాలనందు
దీనతను బొందనేరడు ధీరగుణుడు. 19

పుడమి సుఖదుఃఖములకేమి తడబడకను
రెండిటను నొక్కరీతినియుండువాడు
జ్ఞానియై యొప్పు గొప్ప విజ్ఞాని యగుమ
ముక్తిమార్గమునందెడి శక్తినిగొను 20

పంచభూతాల కిలయాత్మ పట్టువడదు
అన్యులకదం దదెన్నడు నదియె స్థిరము
శ్రుతులు వివరించె నీయాత్మ గతిని యెంతొ
ఇంద్రియాలకు నందని విధముగలిగి 21

ఆత్మయిల చావుపుట్టుక నందునముచు
దలచినను నీవు దుఃఖింప తగదు వినుము
పుట్టునదియెల్ల నీ ధర గిట్టగలదు
గిట్టునదియెల్ల ధరలోన పుట్టగలదు. 22

అవని జనియించి రూపము నందునపుడె
ప్రాణియనునది మన కిలగానబడు చు
తుదకు పోయెడిరీతిని వెదకుకొనును
వచ్చిపోయెడి జీవికై వలదుచింత. 23

ఆత్మ నొకడేమొ యాశ్చర్ప పడుచు జూచు
వేళొకడు విస్మయంబంది వివరణిచ్చు
ఒకడు యాశ్చర్యమందుచు సకలము విమ
ఎవరి తరమయ్యె నీయాత్మ వెతిగికొనగ. 24

దేహములు యెల్ల విధముల దెగునుగాని
ఆత్మయనునది వాటితో హతముగాదు
స్వీయ ధర్మానుచరణము చెరుపటయ్యా
వైరివరులను ద్రుంచగ వెరపదేల. 25

పంచభూతాల కయికీ ప్రాణిజూడ
యెంచ నాత్మను యవియు యబాధించలేవు
ఆత్మశాశ్వతము శరీర మవనివెలసి
గలియు మరలను మట్టిలో నవతరించ. 26

యుద్ధమొనరించ నీవిల సిద్ధపడుము
విజయమందిన నీ కబ్బు విజయలక్ష్మి
హతమువందిన స్వర్గమె యమరగలదు
వీగు గెలుపులు రెండును, విలువనొసగు. 27

తెలియజెప్పితి నీకిది తేటపడగ
యర్జునా లెమ్మి యస్త్రాల నందుకొమ్మి
ఆత్మకిల చావు పుట్టువులంటవయ్యా
దేహము నశించు దీనిని తెగడవయ్యా 28

జీర్ణ వస్త్రాల నిలవ్యక్తి మార్చినట్లు
ఆత్మ దేహాలమార్చి మార్చవతరించు
చావు బ్రతుకుల కర్తవు నీవటయ్యా
నిలువవు శరీరము లిలను నిజము లిసుము. 29

ఆత్మ కిలచావు పుట్టుక లసలెలేవు
దేహము నశించు ఆచిక్కు తీర్చలేవు
పుట్టువది యెల్ల నీధర గిట్టగలదు
సృష్టిలో రహస్యమిదియెంతొ స్పష్టముగద. 30

జరుగవలసిన దెవరి లనెరుగగలరు
ఆత్మ స్థిరమది నాశన మందదెపుడు
నరయ నిటువంటి విజ్ఞాన మరుదె సుమ్ము
భ్రాంతి విడనాడియ స్త్రాల పట్టవయ్య. 31

స్వీయ ధర్మంబు విడనాడ శ్రేష్టమగునె
నీదు కర్తవ్య మెల్లను నీటగలిపి
మిగుల నపకీర్తితో నిల మిగుల గలవు
మరణమున కన్న యపకీర్తి మచ్చగాదె 32

లోకులిది విన్న నగుబాటు లోకువగద
చులకనగ జేసి యలుసుగ చూడగలరు
సూటిపోటుల మాటల నాటగలరు
పౌరుష మదున్న వీటిని పడగ తరమ 33

నేను నుడివి నజ్ఞానము నీకు దెలియ
కర్మయోగ పరిజ్ఞాన మర్మము విను
ఘోర సంసార బాధలు దూరములయి
పోరొనర్చెడి తీరుల పొందిక గన 34

ప్రతి ఫలాపేక్ష నందగ పరుగులెత్తు
ప్రతియొకడు పొందు వికలతక్షితిని నిజము
ఫలితమందెడి తలపడి ప్రతిఫలి చ
నెరిగి ఫలమును దేగడుచే తెరగునుమ్మ 35

కర్మ కాండకు ఫలితము గానబడిన
ఆత్మ విజ్ఞాన పరుని కనవసరమది
కర్మ తప్పదు జీవికిధర్మమదియె
ఫలితమును యందపరమాత్మ ప్రాభవంబు 36

యోగమన ముక్కు చెవులను మూసికొనుచు
నరుగుటయు కాదు సంసారమంతవిడచి
ప్రాప్త మేరీతి తనకు సంప్రాప్తమైన
దిగుల నందనిరీతియె తగినదగును 37

చిత్తము సమత్వ మందిన జెందుశాంతి
మోక్షకారిణి జీవికి మోక్షమిడగ
దైవధ్యాన బు మనసు నిర్వైర్యమొంద
బ్రహ్మజ్ఞానము యలవడు పార్థలినుమ. 38

ఆత్మతత్త్వ విచారణ మరసినావు
కర్మయోగ పిరిజ్ఞాన మర్మము విను
ఆత్మ పరిపక్వ భావమీ యవనిగాంచ
నాత్మవిజ్ఞాన మలవడు నర్హతదియె. 39

ఆత్మ తత్త్వ విజ్ఞానము యలవడినచో
అజ్ఞతయుశోక భ్రాంతులు యణగ గలవు
ప్రతి ఫలాపేక్ష నందని ప్రతియొకపని
వ్యర్థమందదు ఆత్మ విశుద్ధికలుగు 40

నిశ్చ యాత్మక జ్ఞానమే నిహితముగద
ఏకరీతిని పుడమిని యెరుకపడును
నిశ్చయాత్మిక రహితులు నిర్ణయించు
జ్ఞానములు జూడపెక్కులు గానబడును 41

వేద ఫలము త్త మంబన్న వాదనగొని
స్వర్గము త్తమ పురుషార్థ సరణియనుచు
నీపణ త్త్రియ మందగ నిలుతువేని
నిశ్చలంబగు సద్బుద్ధి నిలువదిలను 42

కర్మలిలలోన భోగాల మర్మములని
అవని సుఖముల నందగా నరుగమనుచు
ఫలములొసగని వృక్షాలపూలు మాడ్కి
చెవికి యింపగ మాటలు చెప్పగలరు 43

నీవు నిష్కామపరుడవై నిలచి మిగుల
ద్వంద్వముల కతీతుండవై ధరణి మెలగి
సత్త్వగుణమంది వాంఛల సంగతుడిగి
ఆత్మజ్ఞానము, నొందగనరుగవయ్యా 44

అచ్యుతుండిట్లు పలుకగా నాలకించి
అనియెనంతట నర్జునుడాత్మ దెలియ
బ్రహ్మజ్ఞానము యెటులుండు మర్మమెల్ల
తెలియజెప్పుము నాకిల దేటపడగ.

అడిగితివిగాన నుడివెదనయ్యా వినుము
అనుచు పరమాత్మ యీ రీతి ననియెనపుడు
బ్రహ్మజ్ఞానియు స్థితధీయు బరగనొకరె
ఎరుకపరుతును స్థిత ప్రజ్ఞ నెరుగుమీవు.

తన్మయంబొంది క్రీడించు తనలో తాను
ధరనుగల వాంఛలన్నిట విరతబొందు
కష్టసుఖముల నొకరీతి గాంచగలడు
నిత్యయానంద రూపిగ మెలగగలడు

కష్టములుగల్గ నించుక కలతపడడు
సుఖము, లందెడి, యాశకు దఖులుపడడు
రాగద్వేషాలు మదిలేని యోగివరుడె
ఇలను, స్థిత ప్రజ్ఞ, డనబడు, నిదియె నిజము 4

కూర్మమిల జూడయవయ వాల్కూడదీసి
తనలోని మిడెడి రీతిని దాచుకొనును
అటులె యోగియు ఇంద్రియా ల్నదిమిపట్టి
విషయముల నందకిల నెంతొ విజ్ఞుడగును. 4

మనసు దైవానికర్పించు మాన్యవరుడె
యింద్రియాలను నిర్జించి యిలను మెలగి
నిశ్చలంబగు బుద్ధితో నిలువగలిగి
మిగుల స్థితప్రజ్ఞు డనురీతి మెలుగుచుండు 50

క్రోధమిల మోహములకెల్ల కూడలిగద
మహిని సుజ్ఞానదీపంబె మసకవడును
మరపుగల్గిన బుద్ధియు మాంద్యమగును
బుద్ధి నశియించ జీవుండు బద్ధుడగును. 51

ఫలము నాశించి కర్మలు సలుపువారు
తద్గుణాన్విత జన్మలెనంద గలరు
సరిగ యోగమునంది సమత్వబుద్ధి
నందువారెల్ల మోక్షము నందగలరు. 52

విషయవాంఛలు యిలలోన వీడిపోవ
ఆత్మ పరిపూర్ణతను గాంచు మర్జునుండ
మనసు స్వాధీనపడియు నిర్మలమునంద
జ్ఞానమదిగల్గు నుపదేశ సరణి గనగ. 53

ఇంద్రియాలకు వశమైన యిలను లేదు
ఆత్మశాంతి సుఖంబుల నందలేదు
చిత్తమందున శాంతియె వ్యక్తపడిన
సుఖమదన్నది జూడగ సులువుపడదు. 54

# కర్మ యోగము

## 3వ ప్రకరణము

చేతలకె యాతనిచ్చెడి గీత వినుచు
ఆత్మ పలికెను పరమాత్మ యంతవినగ
జ్ఞానమార్గమునందుట ఘనముగాదె
కర్మమార్గమునకేల కరుణ హృదయ 1

అనగ శ్రీకృష్ణపరమాత్మ యనియెనిట్లు
మార్గములు రెండు మిగుల స్వతంత్రములవి
ఎవరు నిష్కామబుద్ధిని యెదను గలిగి
యాచరింతురొ యారెంటి నరయగలరు. 2

ప్రకృతి కిలలో కువవనట్టి ప్రాణిలేదు
కర్మబద్ధంబు జీవి ! యా మర్మమెరిగి
జ్ఞాని జ్ఞానేంద్రియాలను చక్కనడిపి
కర్మల నొనర్చ నింద్రియాళ్కదల నిచ్చు. 3

కర్మబద్ధుడ నేనను ధర్మమరయ
కోరికలలేమి నాకిల కొరతదేమి
అయిన కర్మల నొనరింతు యవనికొరకు
తెలివినందియు ప్రజలంత తేరుకొనగ. 4

పామరత్వంబు విడుమదీ పాతకంబు
సోమరిగ నుండకిల నీవు స్వామివైన
కర్మబంధంబు జ్ఞానికి కలుగబోదు
అన్నిటికి సాక్షి నేనౌదు నంటకుండ

వినుము నీవు యహంకార మెల్లబాపి
దురభిమానపురీతుల త్రుళ్ళడంచి
ప్రతిఫలాపేక్ష విడనాడి పాటుపడగ
ఫలితమదివచ్చు పరమాత్మ పరవశించ

పూర్వజన్మల సంస్కృతి పుడమిదోవ
జ్ఞాని యజ్ఞానులెవరైన జగతిమెలగు
జీవుడిలరాగ ద్వేషాల త్రోవబట్టి
నరుగకుండిన నాతండు వరయు నాత్మ ౭

కర్మనర్పేడి యింద్రియాల్కట్టువడిన
మనసునందున యాసక్తి మరలకున్న
జనులకాతడె వైరాగ్యఘనుడెయైన
జ్ఞానమదిలేని పరమ యజ్ఞానిసుమ్ము. ౮

ఈశ్వరార్పిత కర్మయు నిచ్చుముక్తి
భిన్నమౌకర్మ నిలనెల్ల ఖిన్నపరుచు
బరుల మేలుకు సత్కర్మ లొనరజేయ
బంధముల పాలుగాక విఫలమునిచ్చు. ౯

అఖిల విశ్వానికి లరూపు యజ్ఞము గద
యజ్ఞమొనరించ బ్రహ్మయు నాజ్ఞయిడెను
ప్రజ్ఞ విజ్ఞత ఫలితము యజ్ఞముగద
దివిజు లిల వృద్ధి నందెడి దీపిక గద 10

అన్నమే భూత కోటికి యాకృతినిడు
అన్న మిలగల్గు వర్షాల యవని గురియ
యజ్ఞమే లేక మేఘాల వసుధ లేవు
కర్మమందునె యజ్ఞముగానబడును 11

వేదములెకర్మకిలలోన నాందియౌను
బ్రహ్మమందు నవేదాల ప్రభవమొందె
విశ్వమెల్లను జూడగయజ్ఞమహిమె
యజ్ఞ మందునె సర్వంబు నమరియుండు 12

ఆత్మయే యతని సంతృప్తి కాదియగును
ఆత్మ యానంద ప్రాప్తి కాధారమగును
ఆత్మ వలననె సంతోషమందగలుగు
నరుని కిలలోన కర్మము లెరుకపడవు 13

జనకమహారాజు రాజర్షి యనగజెల్లు
సిద్ధిపొందిన మిగుల ప్రసిద్ధుడతడు
లోక సంగ్రహణార్థ మీలోకులరయ
సర్వనిష్కామ కర్మల నొనరసలిపె. 14

శ్రేష్ఠుడిల నాచరించిన చేతలగని
ఉర్విజనమెల్ల జేయనుద్యుక్తు లగును
మహిలో నాతని చర్య ప్రమాణ మగుచు
లోకులకు నెల్ల నదియొక తూకమగును 15

నేను కర్మల విడనాడి నిలుతునేని
పుడమి ప్రజలెల్ల కర్మల విడువగలరు
లోకమీరీతినంతట లోపముగాని
సంకరంబంది ప్రజలో సఖ్యతచెడు 16

ఫలము నాశించి కర్మల నిలను జేయు
ప్రతియొకడు జూడయగును యజ్ఞానిసుమ్మ
ఫలము, నాశించ. కనుకర్మ, నిలనుజేయు
జ్ఞాని మార్గమె జగతికి జూడయగును. 17

తాను సలిపెడి కర్మకు తానెకర్త
ననుచు మూఢుడు దలపోయునాత్మలోన
కర్మకిలనాది త్రిగుణాలు కావునీవు
త్రిగుణముల కాది ప్రకృతని తెలియుమీవు. 18

కర్తనేగాను కర్మము ల్వ్యక్తపడగ
సకలమునకెల్ల సర్వాత్మ సాక్షియతడె
అనుచు దలపోయు విజ్ఞాన ఆత్మనెరిగి
కర్మ బంధంబునకు తాను కట్టుపడడు. 19

ప్రకృతి గుణమంది మోహాన ఫలితమంద
కర్మవిలసలుపగా జనుకర్మఫలిల
ఆత్మ విజ్ఞానివారిని యద్దు పరుచు
బుద్ధి బేధంబు గలిగింపబోవరాదు. 20

ఫలము నాశించి కర్మల సలుపువారు
ప్రథమమునవా ఫలాపేక్షమదిని గొన్న
కాలము గతించ వారంత గాంచగలరు
మిగుల నిష్కామ బుద్ధిని నిజముపార్థ 21

సకల కర్మలకిల సాక్షి చక్రియనుచు
నిశ్చలతగల్గి నిష్కామ నిరతిబూని
అవని నభికుడనను భావమణగిద్రొక్కి
వెడలు, మిఁనుస్సు, ధర్మంబు వెలుగుగాంచ 22

శుద్ధినదిగల్గి యీర్ష్యచే బద్ధులవక
సిద్ధరణినాదు మతమును శ్రద్ధగొవిన
కర్మ బంధంబు వారికి గానపడదు
ముక్తినొందును పాపవిముక్తినంది 23

మూఢులను యవివేకులు మూర్ఖమతులు
నన్ను నిందించ పలపడి నష్టముగొను
ఘోర సంసార గూడులో మారగలరు
నాదు మతమును గనలేక నాశనమగు 24

పూర్వ జన్మ సంస్కారమె పుంజుకొనగ
జ్ఞాని యజ్ఞాను లిరువురు జగతిమెలగు
జ్ఞానియును యింద్రియాలకు పట్టుబడడు
ప్రకృతికిలొంగి యెంతైన వికృతి గనక 25

గాన ఓ పార్థ లిమము నాజ్ఞానశక్తి
ఇంద్రియాలకు వశమైనవిలను జోచు
శత్రువులు రాగ ద్వేషాలు మిత్రమగును
జీవుడికి వాటనంది నతోవగనడు 26

రాగ ద్వేషాలెవరువిలో ప్రోగుపడిన
మంచిచెడ్డలు రీతిని తూగించగలడు
స్వీయ ధర్మము నిర్జించ నిలువగలడు
పరుల ధర్మాల నొందగ పారికగలడు 27

స్వీయ ధర్మంబు విలజేయ చెరపురాదు
గుణము లేకున్నకలుగదు దోషమిలను
పరుల ధర్మంబు నరయ భయావహంబు
స్వీయ ధర్మాన శ్రేష్ఠత చిందులాడు. 28

మిగుల వైరాగ్య రీతియె తెగడ బడిన
కామమనది వ్యక్తిలో కానబడును
కామరీతుల నెల్లను కాలదన్ని
ఆత్మ వైరాగ్య వన జ్ఞానరయమీవు 29

మనసు బుద్ధిని యింద్రియాల్మరల నీకు
కామరీతిని నవియెల్ల కలుగజేయు
మానసిక స్థైర్యమది నీకు మంచిదెచ్చు
దేహ భ్రాంతిని విడనాడు తేజముగాన. 30

అంతరార్థము వినుమీవు ఆత్మసఖుడ
ఇంద్రియ విజేత ధన్యుడు యిటమ తెలియ
జ్ఞాన విజ్ఞాన రీతుల జూడసేగి
ఆత్మ ఆనరసెడి శక్తిని యందగలడు 31

స్వీయ ధర్మంబె నిలనెంతొ శ్రేష్టతగద
పరుల ధర్మాల జొరబడ పాతకంబు
అనెడి శ్రీ కృష్ణపరమాత్మ కనియెవిట్లు
ఫల్గుణుడు భక్తిశ్రద్ధల ప్రస్తుతించి 32

పాప మార్గాల నందగ పరుగు లేల
బలిమి నొంది యొక్కొక్కరు పతనమవగ
పాపరీతుల నందెడి లోపమేల
ప్రశ్నకిడునుత్త రంబిల పరమ పురుష 33

అర్జునుని యంతరంగాన యలము కొనిన
ధర్మసందేహమది దీర దైవమపుడు
పలికె సద్గతి యెంతైన పట్టువడగ
ప్రగతి నడదెసలందున ప్రాకిపోవ 34

కామ ప్రేరితనరులెల్ల కాంచగలరు
ఆశ వ్యామోహ రూపయాకారములను
కామక్రోధాధు లెల్లను కలుగ గలవు
వ్యక్తియందు రజఃశక్తి వ్యక్త పడగ 35

పొగలు గ్రమ్మిన యగ్ని పైకెగబడునుకొ
మురికి నందిన యద్దము మెరయబోదు
మావి లపించ మెంతయు మసకపడును
కామమదిగప్ప జ్ఞానము కానబడనె. 36

కామమే కోరికలకెల్ల కారణమిల
పొగయు మురికియు మావియు తెగడ బడగ
కడు ప్రకాశించు వస్తువుల్ పుడమిలోన
కామము నశింప జ్ఞానాగ్ని గాంచుదీప్తి 37

ఇలను పరికించ మన యింద్రియాలకన్న
నమిత తేజము మనసున కమరగలదు
మనసుకన్నను బుద్ధిపద్ ఘనతగలది
ఆత్మయిల బుద్ధి కంటెను పావనంబు. 38

# జ్ఞాన యోగము

## 4వ ప్రకరణము

అర్జునా వినుమిల సర్వమరసిచూడు
జ్ఞాన యోగము దెలిపెద జ్ఞానివగుము
తెలిపితివి తొల్లి సూర్యునకెలమి దీని
నెరిగితిరి అంతవరసగా పరమ ఋషులు 1

అనగ నర్జునుడమి తాద్భుతంబు నంది
వినగ బలికెను యిది యొక వింతదోప
యుగయుగాలకు ముందున్న సూర్యునకును
నేడు గలనీకు సాధ్యంబె నాడు దెలుప 2

ఫల్గుణుడు విన పరమాత్మ బలికెనిట్లు
ఇరువురము యెన్నొ జన్మాల నెత్తినాము
నరవరా నీకు జన్మలు యెరుకపడవు
ఎరుగుదును నేను వాటికి పరుడనవుట 3

ప్రకృతి కిలలొంగి జీవియు పరవశించు
ప్రకృతి నిర్జించగల శక్తిపరుడనేను
జీవులకు నెల్ల నధిపతినైన నేనె
జీవినౌదును యిలనొక ప్రోవకొఱకు 4

శాశ్వతంబైన వేనె యశాశ్వతమగు
జీవులుత్పత్తి నొందగ తోృవవిడుదు
వెనుక పన్మల కర్మల వెలుగులోన
ఐన కర్తమనే గాను అరయమీవు 10

కర్మ ఫలితము నందెడి కాంక్షవీడి
నిత్యయానంద పరుడు నిరాశృయుడును
కర్మలొనరించినను వాడ కర్మపరుడె
కర్మబంధంబున తవికిల గానబడదు. 11

సకల సంసార బాధల పంద్రృము విల
బాటగల రీతి సికిల శేటపరుతు
ననగ యర్జునుడెంతొ యానందపడగ
మరలనీరీతి కృష్ణుండు కరము బలికె 12

కర్మలొ వకర్మ వికర్మ కర్మమందు
నరయ గలవాడె నాదర్శమైనజ్ఞాని
కర్మమర్మము దెలియుట కష్టమైన
వానికిట కర్మబంధంబుగానబడదు. 13

పాృప్తమైనంత స్థితికి సంతృప్తుడగుచు
ఈర్ష్య ద్వేషాల నందక నిలను మెలగి
ద్వంద్వ జగతికి నందని కర్మపరుని
కర్మ లిలసాటి షిద్ధుల కర్మములకు 14

విషయమందలి యాసక్తి వెడలిపోవ
హృదమి గల యాశపాశాలు వీడిచనగ
తనువు కొనసాగవదియు తరించుటకును
వృత్తిజేసిన పాపవి వృత్తిగలుగు. 15

యోగ యజ్ఞము సలుపగ యోగివరులు
ద్రవ్యయజ్ఞము నెరవేర్చు ధరణిపతులు
జ్ఞానయజ్ఞము గావింత్రు జ్ఞానపరులు
తాపసులు జేతురిల తపోయజ్ఞములను. 16

ముక్తినందెడి వ్యక్తుల నెరుకపరుతు
ఆత్మజ్ఞానమునందు సన్మార్గపరులు
ఇంద్రియసుఖాల విర్జించు విమలమతులు
గాఢ యారాధనాత్మ నిగూఢపరులు. 17

పాపి యోగాక నిల నిరుత్సాహపడక
జ్ఞానసాధన యూతగ జాలినపుడు
ధరలో సంసార సంద్రమున్ దాటగలరు
అజ్ఞత నశించు జ్ఞానాగ్ని యంటుకొనగ. 18

జగతిజ్ఞానమె యపురూప ప్రగతి గలది
దీని సరితూగగల దిలగానబడదు
యోగసిద్ధిని పొందిన యోగివరుని
యాత్మలోపల నీ జ్ఞానమమరియుండు. 19

నిగ్రహము శ్రద్ధ మరియు నువిరతిగల్గ
జ్ఞానము లభించు తథ్యము జగతిలోన
వ్యక్తి జ్ఞానోదయంబంద జ్ఞానియగుచు
చిత్తశాంతిని పొందు సమత్వమొంది. 20

మిగుల నాసక్తి యభిలాష మిన్నుముట్ట
యాత్మనిగ్రహశక్తి యెనమరియుండు
విజ్ఞులిలదెల్పు రీతుల విశ్వసించు
వాడు యీ ధర విజ్ఞాన వంతుడగును. 21

సంశయాత్ముని కెన్నడు శాంతిలేదు
సౌఖ్యమన్నది శూన్యము చపలమతికి
జ్ఞాన మిల మోక్ష ప్రాప్తికి జాడయగును
మోక్షమిలశాంతి నందెడి మూలమగును. 22

లోకరక్షణకొరకిల లోకమందు
జ్ఞానులిల కర్మలొనరించ జనగవలయు
స్వీయ ఫలితమునలదలి ధ్యేయమెదల
కర్మబంధంబు ఆతనికి గానబడదు. 23

నీవు నిష్కామపరుడవై నిలచియిలను
యుద్ధమొనరింప నస్త్రాల సిద్ధపరచు
మాత్మసందేహ మదిబాసి యడుగువేసి
ద్వైవలీలగ విధియెల్ల తలచవయ్య. 24

# కర్మ సన్న్యాస యోగము

## 5వ ప్రకరణము

విజయుడంతట కృష్ణుండు వినగ బలికె
ఉర్విలో కర్మలొనరించ నుత్తమంబు
సకల నొకమారు జేయకమాను మనియు
తెలిపితివి యందులోపల శ్రేష్ఠమేది 1

అడిగితివిగాన తెల్పెద నర్జునాఖ్య
కర్మ సన్న్యాస యోగపు కథనమెల్ల
జ్ఞాన కర్మలు రెండు సమ్మానితములె
ఐన నిష్కామ కర్మమె యుక్తతమము 2

ఎదను కోరిక లేమియు మెదలకుండ
అన్నిటనసూయ జెందక నరసిబోవుచు
రాగ ద్వేషాలనెడబాయు యోగివరుడె
తనరు సన్న్యాసి యను నొప్పు తత్త్వవేత్త 3

జ్ఞాని యజ్ఞానులిరువురు సతము భువిని
సర్వ కర్మలనెపుడు సలుపుచుండు
రొకరు కర్మల నంటకను సుకృతిగాంచు
వేరొకడు కర్మబద్ధుడై వేదనపడు 4

అన్నిటికి కర్తదైవంబె యనుచు దెలిసి
కర్మలొనరింప పాపము కలుగబోదు
ఒరుల యాజ్ఞాను వర్తికి దురిత మేద
దైవమును నమ్మినడచిన దైన్యమేద 5

బంధుమమకార ప్రీతి పసందుగనక
హృదయ నైర్మల్యశీలన్ సదా ఋజుపథాన
బుద్ధి నిలుపి నిరీహుడై యద్దరిత్రి
కర్మ లొనరించువాడె పో కర్మయోగి. 6

ఆత్మకిల పుణ్యపాపాలు యంటవయ్య
కర్తయును భోక్తయును గాదు వ్యక్తపడదు
సృష్టికిది కారణంబుగ స్పష్టమవదు
నటన, కిలనాంధి ప్రకృతి నమ్మెటుగనినను 7

ఆత్మయన్నది నన్నింట యవగతమగు
కలుషమన్నది యాత్మకు కలుగబోదు
ఆత్మ యొకరీతెనె చరైన యవతరించు
ననెడి భావకుడగును జుష్మవని జ్ఞాని 8

జ్ఞాన ధనుడగు విప్రుని, వినయపరుని,
శునకమునెగాక శునకాల దినినవాని
గరిని గోవును నొకరీతి గాంచగల్గు
పండితుడె సమ, దర్శనుడనగ జెల్లు 9

సర్వమున నిర్వికారత సంతరించు
బ్రహ్మమందు నదేదివ్య ప్రాభవంబు
నరసి సమ బుద్ధిగలవారె ఆత్మదెలిసి
ముక్తిపరులగు నీ జన్మ ముగియకుండె 10

విషయ వాంఛలు నీలోన వెల్లివిరియు
ఆత్మ పరమైన సుఖశాంతుల లలవడనిల
బ్రహ్మమందునె మనసెల్ల క్రిమ్ముకొనిన
శాశ్వత సుఖమ్ము లిలలోన సంక్రమించు 11

భోగ భాగ్యాలు భూలోక రూపములయి
ఆది యంత్యాల నందలి యమరుకతన
దుఃఖ కారణమగుచు నశాంతి నిడును
బుధుడు నాసక్తి విడచి సత్పథము గనును. 12

కామ క్రోధాల నెల్లను కడకు నెట్టి
చిత్త విగ్రహ శక్తియు వ్యక్తపడగ
నాత్మ రూపము గనుగొను యతివరులకు
బ్రహ్మ నిర్వాణ పథమది పట్టుపడును 13

అవని సుఖములు జూడ నశాశ్వతములు
వేడ్కనిచ్చుచు నరులకు వేదన నిడు
శాశ్వతంబైన యాత్మవిజ్ఞానమరయ
సంత, శానందములకది స్వంత గృహము 14

అన్ని ప్రాణుల నొకరీతి నరయునట్టి
విమలతయున్న హృదిలోన కర్మ పేద
కామ క్రోధాల విర్జించి క్రాంతిగానిన
బ్రహ్మ పదవియె నీకిల పట్టువడును 15

శబ్దవిషయాల లోనికి పొగకుండ
దృష్టి కనుబొమలందున ప్రాణవాయు
నాశికలొవిడి విగ్రహ మరయునాడు
మోక్షమందెడి రీతి ప్రత్యక్షమగును. 16

# ఆత్మ సంయమ యోగము

## 6వ ప్రకరణము

ఆత్మ సంయమ యోగంబు నరయుమీవు
తెలియజెప్పెదనీకిం కేటపడగ
ఫరసు సంకల్పరీతుల నెరినెరింగి
విషయమందున యాసక్తి విడువ వలయు 1

ప్రతి ఫలాపేక్ష నాశను వదలిపెట్టి
నిలను కర్తృత్వమన్నది తొలగిపోద
జ్ఞానవైరాగ్యముల గొను జనుడెమిగుల
యోగమందగ నీధర యోగ్యుడగును 2

ఒకరి యభివృద్ధికిలకర్త లొకరుకాదు
సిద్ధపడుమీవు నీయాత్మనుద్ధరించ
పృథ్వి నున్నతస్థితి స్వయంకృషి యనంగ
వినమెజూడమె మరిజడ్డుదనమదేల 3

మనసు స్వాధీనపడినట్టి మనుజవరుని
కాత్మనరయగబంధువై యమరగలదు
ఇంద్రియాలకు లోకువై నిలసుమెలకు
వ్యక్తికిలయాత్మ శత్రువై వ్యక్తపడును 4

ఇంద్రియాలకు వశమైన యిలనులేదు
మానసిక శాంతి అదిలేని బ్రతుకదేల
మనసు నిర్జించి మనగలుగు మనుజుడదె
శాంతిగాను ద్వంద్వముల తిక్రాంతుడౌను 5

మన్ను కనకాలనొకరీతి నెన్నుకొనెడి
యుత్తముడు పొందు నిలలోన యోగసిద్ధి
మిగుల సమభావమేర్పడి మెలగియులను
హెచ్చుతగ్గులనుడి సరిపుచ్చుకొనుచు 6

అమిత యాహారపరుడ నాహారపరుడు
సతము నిద్రించు వాడును స్వప్నపరుడు
ఆత్మ విజ్ఞానమందని నజ్ఞులగుచు
యోగమునుపొందజాలడు ఓయిపార్థ 7

యోగమది నభ్యసించగ యోగివరుడె
మిగులనేకాంతస్థలమున మెలగవలయు
ఆత్మస్థిరతకు వాంఛలనణచుకొనుచు
దైవభావమె నిలువెల్ల తాండవించ 8

సంశయముబాసి దీనత, తరలిపోవ
వాంఛలన్నివి తననుండివదలి జనగ
ఇంద్రియాలను నిర్జించి నిరతమెలగి
యోగమభ్యాస మొనరింప బూనవలయు 9

సర్వమా దేవ దేవుని సత్కృపయని
దైవమందున మనసును శ్రద్ధనిల్పి
సర్వకాలాల నా ప్రభు సంస్మరించి
ఆత్మ దెలియ నమందాను భూతినందు 10

ఆత్మలో జగతినంతను యరసిమరల
సర్వమందున తనయాత్మ సరిగజూచు
నతడె నిల సమదర్శనుండగ జెల్లు
సర్వమిల బ్రహ్మమయమని యుర్వినెరుగు 11

అన్నిటిలో దైవతత్త్వమె యమరియుండు
దైవమందునె యన్నియు తెలియబడును
అనెడి యిరువురు నాకెల నొకరెసుమ్ము
పార్థ నొకరిది యొకరిదారాధనమిల 12

అఖిలప్రాణుల సుఖదుఃఖ పటలముగని
తనదు సుఖదుఃఖములగనె తలచువాడు
యుర్విప్రాణుల హితుడగు నుత్తముండు
ననగజెల్లును ఓపార్థ వినుమనీవు 13

ధర్మమదిదెల్పు కృష్ణబోధామృతంబు
వినుచుపార్థుడు పరమాత్మకనియెనిట్లు
ఆత్మచాంచల్య రీతివి యరసినాథ
అర్హ తున్నదయోగమునభ్యసింప 14

మానసిక నిగ్రహంబంద మనకుతరమ
వాయువును నిగ్రహించుట వశమ మనకు
మనసు స్వాధీనపడునని యనగ నెటుల
వ్వదమినా సంశయముదీరమధువునయ్య 15

అర్జునుని యాత్మసందేహమును దీర్చ
పలికె పరమాత్మ సంశయం సమసిపోవ
మనసు చంచలమతిదుష్టమైననేమి
మార్గమున్నది సాధింపమనకుపార్థ 16

వ్యక్తియభ్యాసబలిమి వైరాగ్యబలిమి
వ్యక్తమగుచుండ సాధన పెన్పొందు
మనసు స్వాధీనమగుటకు మరియు నీవు
యోగమును యాచరించుటే త్తమమగు 17

కృష్ణుడీరీతి పలుకగ ఫల్గుణుండు
ప్రశ్నించె పరమాత్మునే ఫలికగాను
యోగసాధన మధ్యలో లోకమిడువ
ఇహపరాలకు యాతడు దూరుడగున 18

అర్జునుని సంశయము దీరననియె నిట్లు
యోగభ్రష్టుడు ధరను సుయోగ్యుడగునె
పూర్వజన్మ సువాసన ఫలములోన
పుణ్యవంతుల గర్భాన పుట్టగలడు 19

గడచిపోయిన జన్మాల గతులవెల్ల
విడువగను నాతడెంత్తైన మెలగగఁడు
పూర్వజన్మపుసుకృతము పుంజుకొనగ
నాత్మయోగిగ ముక్తిని యందగఁడు 20

జన్మలనుపొంది పాపాలజనగనాదె
యోగిగా జన్మమెత్తకి యోగ్యతగను
మిగుల నిష్కామకర్మయే మేలిమిలను
తెలియు మోపార్థ వీవిల తెలివిమీర 21

# విజ్ఞాన యోగము

## 7వ ప్రకరణము

ఆత్మ సంయమయోగము నరసినావు
వినుము విజ్ఞానయోగము విశదపరుతు
దైవయోళక్తి పరుంకు తెలియదగిన
జ్ఞానమెరిగింతు నీజన్మ సార్థకమవ 1

బ్రహ్మజ్ఞానము నెరిగింతు పార్థ నీకు
యెరిగి తవచేవి టీవిని ఎదను విల్చు
మితర మిలనీ కనవసరంబింక మీద
బ్రహ్మవిద్యా ప్రవీణులు పరిమితమిల 2

ప్రకృతి యెనిమిదిరకములు పార్థవినుము
పృథివి, నీరును, వాయువు బుద్ధిమనసు
అగ్ని, గగన, మహంకార మనగనివియె
చిహ్నములు ప్రకృతికి నిజమెన్న గనుము. 3

చూడు మర్జున జగతిని శుద్ధ ప్రకృతి
చేత నా చేతనత్వము చెలువు గనను
భూతకోటికి నీరెండు నూతనిచ్చు
శుద్ధ ప్రకృతియె నారూపు యిద్ధరిత్రి 4

సృష్టికర్తను ప్రళయకారకుడనేనె
మదిని జూడుము సర్వోపగతుడ నేను
అన్నిటను నేనె అంతట నున్నవాడ
నాలో యీ విశ్వమిమిడెను నరయు మీవు. 5

సర్వభూతాలకిల బీజశక్తి నేనె
జీవనాధారమును సర్వజీవులకును
ఉదకమునయందు రసము నేనౌదునమ్మ
భువిని పరిమళమౌదును భవ్యుడనౌదు. 6

దినకరుడు చంద్రు డిలకిడు దీప్తినేనె
అగ్నిలో తేజమును నేనె యౌట నిజము
వినయనాకాశమందలి ధ్వనినినేనె
నరుల యందలి పౌరుష। మ్మరయనేనె. 7

వేదములయందు నోంకార మౌదునేనె
బుద్ధిమంతులయందున్న బుద్ధినేనె
శౌర్యపరులకు తేజస్సు శక్తినేనె
తాపసులయందు వెలుగొందు తపమునేనె. 8

వన్నెరుంగుము యాత్మలో వరుడనీవు
కాంక్షయను రాగ మదిలేవి సరళహర్షి
కామమునునది నాలోన కానబడిన
నేను మాత్రము దానిలో నిముడబోను. 9

హర్ష శోకమోహాదులు అవనియున్న
శమదమాదులు నాలోనె యుదయమయ్యె
అయిన నే వాటిలో లేను యరయుమిప్పు
అన్నిటనునుండు వాటికి నందకుండ 10

త్రిగుణములగల్గి నీ ధర తిరుగుచున్న
నరులు నారీతి నరయుట నరుదె నుమ్మ
త్రిగుణములకే నే నతీతుడ తెలియుమిప్డు
త్రిగుణమగు వారు మాయను తెలియలేరు. 11

పార్థ వినుమన్ను గొల్వని పాపులెవరొ
మూఢులై జ్ఞానమదిలేక మూర్ఖవారు
త్రిగుణములనంది మూఢులై తిరుగువారు
నరయ హింసాత్మకులు మనుష్యాధములును. 12

వివరణిదిచూడు నా భక్తులెవరొ యిలను
మిగుల కష్టాలలో బడివగచు వారు
కోరికలు దీరయిలలోను కొలుచువారు
ఆత్మ జ్ఞానులు మోక్ష జిజ్ఞాస పరులు 13

భక్తిపరునికి సుళువుగ పట్టు పడుదు
భక్తి కలిగిన జ్ఞానికి రక్తి నిడుదు
శక్తి యుక్తుల నిడుచును సర్వమిడుదు
జ్ఞాను లెరుగుదు రిలనునే జ్ఞానియనగ 14

పుట్టుకలనందు నడుమ పూర్వజన్మ
కర్మలను భవమందియు క్రాంతినంద
విశ్వమెల్లను సాక్షి విష్ణువనగ
నరుడు జన్మకు సార్థక్య మరయునాడె 15

కోరికల భ్రాంతిలోబడి కోరుకొనదు
మనసు ముక్తిని ప్రతిఫలమందనెంచి
ఫలము నాశించి ప్రార్థన సనిపిరేని
ఫలితమిడుదును ముక్తిని బడయలేరు 16

స్వీయదైవ సమర్చన జేయువారు
ఆత్మ కనురూపమైనట్టి యర్చనలిడ
నిచ్చ గొంతు రొవార లొనర్చవచ్చు
భక్తి శ్రద్ధలు నానుండె ప్రభవమందు. 17

దేవతయె గొల్వబడినను గావగలను
కోరికలదీర్చి నరులకు కూర్మినిడుదు
దేవతలు నామ మాత్రము దైవమేను
కోరికల దీర్చు కర్తను కురుకుమార 18

పూజలొనరించి సేవలపుతమి సలిపి
భక్తిశ్రద్ధల నెంతయు భజనసేయు
నిడుదు వరముల భీష్టాల నెఱపుచుందు
భక్తకోటికి వశమౌదు రక్తినంది 19

మూఢులెరుగరు మిగుల నాజాడలన్ని
మాయలోబడి నన్నిల పరువగలరు
చావు పుట్టుకలేలేని దేవుడనని
తెలిసికోలేరు యజ్ఞాలు తెలివిమాలి 20

నేటిగల జీవినిలనొకనాటిజీవి
అవని కేవచ్చు రేపటి జీవికూడ
అవగతంబగు నాకెంతొ నరుడ వినుమ
జీవి గనలేదు నన్నిల తోవబాసి 21

పుట్టుకతో రాగద్వేషాలు పుట్టునుగద
పుడమినవి జ్ఞానరీతిని పూడ్చగలవు
కోరికల గూడునందున గూలద్రోసి
దైవమును గాంచి నెరిగెడి దారిచూపి 22

పుణ్యకర్మల నొనరించి పుడమిలోన
పాపమెడబాయు నరుడు ప్రక్షాళితుడగు
పాపరహితుడె దేవుని పజ్జజేరు
ముక్తి సౌధాధిరోహణమొనరజేయు 23

జన్మ రాహిత్య మందెడి మర్మమరసి
దైవధ్యానమునందెడు ధర్మపరులె
కర్మ యాథాత్మ్య రూప సద్ధర్మములను
తెలిసికొనగల్గు నిల జితేంద్రియములుసుమ్మ 24

• గీత వినుచును పరమాత్మ నంతమగని
పార్థుడడుగగ ప్రశ్న పరంపరలను
ఆత్మరంజింప పరమాత్మ యంత దెలిపె
మిగత పదకొండు యోగాలు విదితమవగ 25

• ఆత్మ పరమాత్మ రూపాలు యవగతమవ
నర్జునుండంత శస్త్రాల నందుకొనెను
మిగుల నిష్కామ మెంతయు మేళవించ
స్వీయ కర్మాల నెరవేర్చు ధ్యేయమందె 26

• ధరను విద్యుక్త కర్మము నరసినడచె
నరుడు జ్ఞానోదయంబందె యెరిగెతనను
నరుడు నారాయణుండును వరములిడిరి
శాశ్వితానంత సుఖములు సర్వులంద 27

## సమాప్తం

• గీతలో దెలుపబడినది కాదు.